Regd No. N. 45 / M. 3813

వెల ఒక అణా

102 848

# గోలకొండపత్రిక

★ హిట్లరు, మాలటోవుగారల సంభాషణ ★

★ ఆస్ట్రేలియా ప్రాంతములో యుద్ధభయము ★

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

సంపుటము ౧౫ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౨ విక్రమసం॥ కార్తీక శు॥ ౧౫ (౧౦-౨-౧౩౫౦ ఫ.) గురువారము సంచిక ౫౩

# గ్రీసుపై జర్మనీ, ఇటలీల యెత్తు

## గ్రీసుపై జర్మనీ, ఇటలీల యెత్తులు?

### ఇటాలియా సేనలకు క్రొత్త అధిపతి

నవంబరు ౮వ తేదినుండి ౧౧వ తేదివరకు వచ్చిన ఇటలీ గ్రీసుల యుద్ధ వార్తలలో యుద్ధసమాచారములేవియు గణింపదగినవిలేవు ఇటలీసేనలు మొత్తముమీద యింతవరకు గ్రీసుదేశములోనికి పోజాలకుండుటయు, గ్రీసుసేనలే అల్బేనియాలోనికి మూడునాలుగు మైళ్ళవరకు కూడా ముందుకు సాగిరాగలిగియుండుటయు ఇటలీవారికి ఆందోళన కలిగించియుండవలెను. అందువలననే కాబోలు గ్రీసుపై దండయాత్రచేయుచున్న ఇటలీ సేనలకు ప్రధానసేనానిగా ఇప్పటివరకు ఉన్నవారిని తొలగించి జనరల్ సొడ్డూ గారిని నియమించియుండిరి. వీరు నవంబరునెల ౯వ తేదీన తమపనిలోచేరినారు. బ్రిటిషువిమానాలు గ్రీకువిమానాలతో కలిసి ఇటాలియసైనిక ప్రదేశాలపై దాడులు సల్పుటలోను గ్రీకు దేశంలోకి శత్రువులుచొరకుండ ఆటంకపరచుటకై గస్తుతిరుగుటలోను పాల్గొనుచుండుటయే గాక, ఇటలీలోకిపోయి తిరిగి శత్రుసేనల రహస్యములను తెలిసికొనుటకు యత్నించుచున్నవి. ఇప్పుడు క్రీటుమున్నగు ద్వీపములలోకూడ బ్రిటిషుసేనలు వచ్చిచేరుటవల్ల అదివరకు ఆదీవులప్రజలలో కలిగిన నిరుత్సాహ భయములు ఎగిరిపోయినట్లు చెప్పుచున్నారు. గ్రీసు సైనికబలమును అభివృద్ధిచేయుటకై గ్రీసు ప్రభుత్వము వారు ౧౯౩౫లో తొలగించిన సైనికాధికారులను తిరిగిచేర్చుకొనుచున్నారు. ఇంతవరకు రిజర్వుగాయుంచబడిన సైనికుల నందరిని పనులలోకి పిలుచుచున్నారు. ఈజిప్టులోపుట్టిన గ్రీకులలో ఇంతవరకు సైనికశిక్షణపొందనివారు ఈజిప్టులోని గ్రీకు రాయబారి కార్యాలయమునకు పోయిరి. సైనికశిక్షణకై రిజిష్టరుచేయించుకొనవలెనని ఆజ్ఞచేయబడినది.

యుద్ధము

నవంబరు ౮వ తేదీనాటికి పిండూస్ ప్రాంతంలో ఇటాలియా సేనలను గ్రీకుసేనలు ముట్టడివేసి వారి ఆయుధసామగ్రిని వశపరచుకొనగల్గుచున్నవి కొరిట్జాప్రదేశములో స్లైమెనిట్జాలో గ్రీకులుముందుకు పోయిరిగాని ఇంకను గ్రీసుసరిహద్దుదాటలేదు. యపైరస్‌రంగములో ఇటాలీయ సేనలు వెనుకకుతరుమబడినవి.

నవంబరు ౯వ తేదీనాటికి గ్రీకు సేనలు పిండూస్‌రంగములో కొంతముందుకుపోయెను. సరిహద్దుకు ౧౦మైళ్ళదూరములోనుండెను. ఈరంగంలో గ్రీకులచే ముట్టడివేయబడిన ఇటాలీయసైనికులు అనేకులు చలికిని అడవిమృగాలకునుబలికాగా వారలశవాలు వరదలైపారుచున్న అవ్రూఫ్‌నదిలో తేలుచున్నవట- ఇంకను అనేకులు ఖైదీలుగ గ్రీకులకుచిక్కియుండినసంగతి ప్రాతసమాచారమే. నవంబరు ౮వ, ౯వ తేదులలో ౧౫౦ ఇటాలీయ సైనికులు, కొన్ని మరఫిరంగులు గ్రీకుల వశమయ్యెను. పడమటి యపైరస్‌లో మాత్రమే ఇటాలీయ సేనలు కొంతవరకు గ్రీకుదుర్గములవరకు చేరినవి.

నవంబరు ౧౦వ తేదినాటికి గ్రీసు అల్బేనియాల సరిహద్దువద్ద ఒకచిన్నపోరాటములో గ్రీకులు ఇటాలియా సైనికులను తరిమివేసి ౮౦ మందినిఖైదీలనుగా పట్టుకొనిరి.

౧౧వ తేదినాటికి యపైరస్‌రంగములో మూడుఇటాలియసైనిక జెలోని యనులు చెదరగొట్టబడినవి.

విమానాలదాడులు

అల్బేనియాలో వాలానోయందు ఇటాలియవిమానాశ్రయముపై నవంబరు ౭వ తేది గ్రీకువిమానాలు ౫ టన్నుల బాంబులు వేసెనట. బ్రిటిషువిమానాలు టోరంటో, బ్రిండిసీలపై అదేరోజుబాంబులు వేసెను; తమనెదిరించవచ్చినవిమానాలలోనుండి ఒకదానిని పాడుచేసెను, ఈరోజు ఇటాలీయవిమానాలు గ్రీసు-అల్బేనియామధ్య సరిహద్దు గ్రామాలపై మాత్రముండెను.

నవంబరు ౮వ తేదీనాడు గ్రీసుఫిరంగులచే ఒకఇటాలియా విమానముక్రింద కూల్చబడెను. సార్డీనియాలో కాగ్లియారిపై గ్రీసువిమానాలు దాడిసల్పెను.

సముద్రములో గ్రీకులమందుగనులు

గ్రీసు వారు కావల్లాసముద్రశాఖలోను, సెలోనికా సముద్రశాఖలోను, యూబోలియా ద్వీపములమధ్యసముద్రములోను మందులను మాటుపెట్టినారు.

### జర్మనీ, ఇటలీ యెత్తులు

గ్రీసుపై ఇటలీదండయాత్ర విషయంలో జర్మనీ, ఇటలీలకు మనస్సులు కలియునట్లు ఇదివరలో ఒక వార్త వచ్చియుండెను. కాని ఇప్పుడువచ్చిన ఒక వార్త అట్టిభేదములిప్పుడైతే లేవనుచున్నది. గ్రీసుతోపాటు యూగోస్లావియాను, ఈజిప్టును, తమ సేనలనష్టములేకుండ జెడరింపులు, మెత్తనిమాటలు మొదలగుపద్ధతులతో శీఘ్రముగా వశపరచుకొనుటకై జర్మనీ, ఇటలీలు ఆలోచించుచున్నవట. కాని ఈజిప్టుగ్రీసులకు సంబంధముకలుగునట్టి అనుకూలమైనక్రీటుదీవిలో బ్రిటిషు సేనలున్నవి. ఇక్కడినుండి బ్రిటిషు సేనలు ఈజిప్టును, పాలస్తీనానుకూడ రక్షించుకొనగలవు. మరియు మధ్యధరాసముద్ర పూర్వభాగమున జిబ్రాల్టరు ముఖ్యమైనట్లే పశ్చిమభాగమున క్రీటుద్వీపముకూడ ముఖ్యమైనది. ఈరెండును బ్రిటిషువారి వశములోనుండుటచే మధ్యధరాసముద్రమంతయు బ్రిటిషువారి వశములోనుండగలుగును

## బ్రిటనుపై జర్మను విమానాల దాడులు

బ్రిటనుపై జర్మనువిమానాలదాడులు మరల నవంబరు ౬వ తేదినుండికొంతయెక్కువతీవ్రముగనే యున్నవి కాని చెప్పదగినవిశేషాలు ఎక్కువలేవు.

నవంబరు 3 వ తేదిరాత్రిదాడిలో ఇండ్లు, దుకాణములు, ప్రజాసౌకర్యములు కొన్ని చెడెను కొందరుమరణించిరి, కొందరుగాయపడిరి.

నవంబరు ౭వ తేదిఉదయము లండనుపట్టణములలో పనులకుపోవుచుండిన స్త్రీపురుషులపై బాంబులేగాక, మరఫిరంగులుకూడ జర్మనువిమానాలనుండివేయబడెను. ఈరోజు సాయంత్రమువరకు శత్రువిమానాలధాటి తక్కువగనే యుండెను. ఈనాటిరాత్రి లండనులోకి ప్రవేశించయత్నించిన శత్రువిమానాలపై ఫిరంగులదెబ్బలు చాలతీవ్రముగనుండెను

నవంబరు ౯వ తేది ఉదయపు దాడులచే నష్టము తక్కువ. మొత్తముమీద ఈరోజు అంతయు జరిగినదాడులచే కొందరుమరణించిరి, కొందరు గాయపడిరి. కొన్నియిండ్లు చెడినవి కానియెక్కువనష్టములేదు

నవంబరు ౧౦వ తేదిరాత్రి సిసిలీదీవులమీద శత్రువిమానాలనుండి మరఫిరంగులుపడెను కెంటుససెక్సుతీరాలలో కొన్నిపట్టణముల పై పరులయిండ్లుకూలిపోయెను.

లండనులో కౌంటీ క్లబ్బులోనుండిన ౪౦ మంది పార్లమెంటుసభ్యులు కొద్దిలోతప్పించుకొనిరి

## హరిజన్, పత్రికపాఠకులనుండి గాంధిజీసెలవు

### స్వేచ్ఛలేనిది ఏమీచెప్పలేను.

గాంధిమహాత్ముడు 'హరిజన్' ఇంగ్లీషు, హిందీ, గుజరాతి పత్రికల పాఠకులనుండి తుదిసారి సెలవుగైకొనుచు నవంబరు ౧౦వ తేదీ అనగా ఆనాడు ప్రస్తుతమునకు కడసారిగ వెలువరించబడిన "హరిజన్" పత్రికలో ఒక ప్రకటనచేసినారు అందలిభాగములు ఈక్రింద ప్రకటించబడుచున్నవి:

"హరిజన్", తక్కినదింపువారపత్రికల ప్రచురణము తాత్కాలికముగ నిలిపియుంచిరని మీరు నాపత్రికాప్రకటనవల్ల తెలిసికొనియుందురు- ప్రకటనయందు చేసినపునల ఒకవారమువరకుమాత్రమే అయియుండవచ్చునని ఆశపడినను- కొనసాగుట నాకు నిజములోనిది భావముగ నాపకనపడుచున్నది- ప్రతివారము మీతో నాకులభించుచుండిన సంభాషణలికమీద ఉండవనిదానివిచారముగనున్నది- మీకనుల్లోటు కలుగునందునకొందును- అసంభాషణల ప్రయోజనము నాహృదయాంతరాళములోని భావము నిష్కపటముగా తెలియును- బంధములతో నిండినపరిస్థితులలో అవిసముగ తెలుపు సాధ్యపడదు- శాసనోల్లంఘనముచేయుట నాకిష్టములేదుకనుక, నేను స్వేచ్ఛముగా వ్రాయజాలను- సత్యాగ్రహిగనైయుండి, నేనునామనసునకు విరుద్ధముగా, విధ్వంసకార్యక్రమమువంటి నిరాపేక్షమైనకార్యములనుగూర్చి వ్రాయగల్గుటకైనా ఆత్మలోని శివభాగమును అణచివేయజాలను. అట్లు సేయుట తలతేని మొండెమునుగురించి చెప్పినట్లు మను- అసలునిర్మాణకార్యక్రమమంతయును అహింసయొక్క వ్యక్తరూపమేనని నామతము- అహింసను నేను బోధించలేనిచో నాయాత్మసేవకు లోనైనవాడను- ఇటీవలచేసిన అట్టిసెన్సారుప్రాంతేమగును- కాబట్టి, నిర్బంధము ఉన్నంతకాలము పత్రిక ఆపుజేయవలెను- అట్లుచేయుట అనిర్బంధముయొక్క అగ్రహమును సత్యాగ్రహిమర్యాదగా తెలుపుటయగును- సత్యాగ్రహమునగా, తప్పుచేయుచున్నవాడు ఒకఅంగుళము నడిగినపుడు గజముకంటెఎక్కువ యిచ్చుటయు, కోటుమాత్రమే అడిగినపుడు ధరించినబట్టలనుకూడ ఇచ్చుటయుకాదా! సాధారణముగాచేసేదానికి తల్లక్రిందైన యీపద్ధతి హింసపై ఆధారపడినది- నాజీవితము కుటిలహింసాప్రేరితమైనచో, మొదట ఒకఅంగుళమిచ్చినచో తర్వాతగజముకూడనీ అడుగవచ్చునను భయముతో ఆఅంగుళమునే యివ్వనిరాకరింతును- దీనికిభిన్నముగాఆచరించినచో నేనుమూర్ఖుడనగుదును- నాజీవితము అహింసాప్రేరితమగుచో, ఒకఅంగుళమును మాత్రమేఅడిగినపుడు నేనుగజముకంటెఎక్కువయిచ్చుటకు సంసిద్ధుడనైయుండవలెను- అట్లుచేయుటవల్ల నేను అతపహరించువానిలో ఒకవిచిత్రమైన, అనంతమైనట్టియు భారమును కలిగించినవాడనగుదును- మరియుఆతడు మానుడైనన్నిమిచే మనతోకలిసికొనవలెననో అదిశత్రువునుచ్చట నేనో. అప్రధానమైనదానినెల్లత్యజించుటను నిశ్చయముకొనుటచే, ప్రధానమని నేనుతలచుదానినెల్ల కాపాడుకొని నిల్పుకొనుటకొరకై ప్రాణమునర్పించుటకు పూర్వముతెంటెఎక్కువశక్తిని పొందినవాడనగుదును...

........ ........ —— ...................

.........నిర్బంధపుఆర్డినెన్సును చేసినవారికి వేసులొంగుట పాఠకులకు మీకువస్తునిదర్శనముతో చెప్పుసత్యాగ్రహపాఠమగుచున్నది- ఈపాఠము యొక్క అంతరార్థములనన్నిటిని మీజీవితములో మీరు ఆచరించినచో, అప్పుడుమీకు "హరిజన్" పత్రికయందలివ్రాతచే ప్రతివారముకల్గుచుండినసహాయముఅవసరమేమగును- 'హరిజన్' వారపత్రిక లేకున్నను. ఒకఅంగుళము నడిగినపుడు గజముకంటె ఎక్కువనిచ్చుపద్ధతియొక్క అంతరార్థమును నేనెట్లుఆచరణలో పెట్టుదునో మీకు తెలియగలదు ........ ...... . ......

.........నిప్పటిమీదు వారపత్రికలలో యొకదానికి సంపాదకుడనైతే, నాటినితిరిగి ప్రారంభించుటకెప్పటికైనవీలైనచో అదిఎప్పుడో నాకేతెలియదు నీచందాలోఉపయోగించని భాగము మరివాపసుపొందుటకుమీకు హక్కున్నది. అట్లువాపసుకోరుమనీవుఆర్డరుగా "హరిజన్" మేనేజరుకు ఒకకార్డువ్రాసినట్లయిన, నీమొత్తమునీకు పంపబడును- అట్లువాపసుకోరనివారికిగివ్వత్రిక ప్రారంభించబడినప్పుడు పత్రిక పంపబడును- అట్లుకానిచో, వాపసుకోరబడనిమిగతమొత్తమును పత్రికలనుఆపుచేసినందువల్ల ఏర్పడినష్టమును తీర్చుటకై వినియోగింతురు- అప్పటికిని ఏమైనమొత్తముమిగిలియున్నచో అది పాఠకులకే లోనుపయోగించుటకై "హరిజన్ సంఘము"నకు పంపబడును- మరికొన్నినెలల లో "హరిజన్" మరల ప్రారంభించబడనిచో, దానినిశాశ్వతముగామానుకొనినట్లేయగుచున్నవని ఇప్పటికి తమునుండి సెలవుగైకొనెదను-

## గాంధీమహాత్ముడు

[రెండుభాగములు]

రాజకీయముగను, సాంఘికముగను, ఆర్థికముగను అధోగతిపాలై, కాని సలుగ జీవించుచు అధ్యాత్మములపాలై, ఆత్మవిశ్వాసమును గోల్పోయి, స్వయంశక్తి విడనాడి అనాథలైన భారతీయుల నుద్ధరించుటకై,

"ఎప్పుడెప్పుడధర్మము వృద్ధిజెందునో దానినిబోకార్చుటకై జన్మించుదు"నని శ్రీకృష్ణుడు వక్కాణించినటుల

మహాత్మాగాంధి అవతరించెనని సాదృశ్యముగా నిరూపించు వ్రాయబడిన అద్వితీయమైన గ్రంథము

శ్రీ. డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారి అమూల్యమైన "ఉపోద్ఘాతము" గలదు. వెల ౧-౨ అణాలు.

దేశోద్ధారక గ్రంథమాల, సికింద్రాబాదు

## బ్రిటిష్ అమెరికా రాజ్యాలతో సంయుక్తరాష్ట్రముల ఒడంబడిక

బ్రిటిష్ అమెరికా రాజ్యాలలో అమెరికా సంయుక్త రాష్ట్రముల సైన్యములు, విమానములు, నౌకలు అవసరమైనప్పుడు ముఖ్యస్థానములను ఉపయోగించుకొనుటకు ఒడంబడిక కుదిరినది

గోలకొండపత్రిక

విక్రమనామసం॥ర కార్తీకశు॥ ౧౧

గురువారము

# ముల్కీ-భాషల స్థానము.

రైట్ ఆనరబుల్ నవాబ్ సర్ హైదర్ నవాజ్‌జంగ్ బహాదర్‌గారు జగద్విఖ్యాత పురుషులు అపూర్వ రాజకీయ మేధావంతులు వయసుచేతనేమి, అధికారముచేతనేమి, విజ్ఞానము చేతనేమి వారు గౌరవస్థానము వహించియున్నారు వారుచెప్పినదెల్ల ఆజ్ఞయే ముట్టినదెల్ల బంగారమే సంకల్పాలన్నియు విజయవంతములే వారి యనంతరము వారి యేచర్యలను మరచినను జనులు వారు సృష్టించిన ఉస్మానియా విద్యాపీఠాన్ని మాత్రం మరచిపోరు. అందలి ఉర్దూవిశిష్టత సర్వలోకప్రసిద్ధము

అట్టి మహామహుల రూపపట బహిరంగోత్సవము గతవారం ఉస్మానియావిద్యాపీఠకళాశాలలో జరిగినది బహిరంగపరచిన వారు నవాబ్ మొహిదీయార్ జంగ్ బహద్దరు వైస్‌ఛాన్సలర్ గారు మాట్లాడినవారిలో ముఖ్యులు దివాన్ బహద్దరు అరవమూదయ్యంగారు గారు. ప్రేక్షకులలో ముఖ్యులు నవాబులు, రాజులు, కోటీశ్వరులు, ప్రొఫెసర్లు, వకీళ్లు గొప్ప అధికారులు. స్థలమా ఉస్మానియా విద్యాపీఠపు అద్వితీయ భవనము రంగమా నూర్లకొలది కళాశాలావిద్యార్థులు — భావిరాష్ట్రోద్యోగులు-ఉన్నతవిద్యను స్వేచ్ఛాపథముగా నభ్యసించు స్థానము

ఇదంతయు సాధారణవిషయమా? సర్ అక్బర్‌గారి సర్వజన ప్రియత్వమునకిదియే తార్కారణ ఆనాడు అచ్చట ఉపన్యాసకులు సర్ అక్బర్‌గారి విషయమై పలికిన ప్రతివాక్కుతో మేమేకీభవించుచున్నాము

మన రాష్ట్రములో పూర్వములో కాకున్నను రాజకీయ రాజ్యాంగము తర్వాతనైనను దివాన్‌బహద్దర్ ఆరావమూదయ్యంగార్ బి.ఏ. బి.ఎల్. యం.బి.ఇ. అడ్వకేటుగారిని చాలామంది యెరిగియున్నారు వారు వకీళ్లు మంచి వక్తలు సంస్కృతమందు మంచి అభిమానముకలవారు వారియుపన్యాసములు నీతియుక్తముగా విషయవంతముగా నుండును

సర్ అక్బరు హైదరీగారిని గురించి పైసభలో పైదివాన్‌బహద్దరుగారున్ను మాట్లాడుచూ నవాబ్ సర్ అక్బర్ హైదరీగారి ప్రశంసను గావించుచు తత్సంబంధములో ఈక్రింది వాక్యాలనుకూడ సెలవిచ్చినారు

"సర్ అక్బరుగారు హిందూస్థానీలో విద్యాబోధ నేర్పాటుచేయించి మన జాతీయ గౌరవమును పెంచినారు ఇదొక అపూర్వమైన పరిస్థానము ఇట్టి మరొక పరిస్థానంకూడా వారు చేయలేరా? ఉస్మానియా ఎట్లో అట్లే రాష్ట్రములోని ఇతరభాషల యొక్క అనగా తెనుగు, మరాటీ, కన్నడ భాషల యొక్క అభివృద్ధికి తోడ్పడి దేశాభివృద్ధిలో నవియు పాల్గొనునట్లు చేయలేరా? "

ముల్కీ-భాషల ప్రేమించువారు ముల్కీల కందరికిని ప్రీతిపాత్రులగుదురు దివాన్ బహద్దరుగారి అభిప్రాయముతో ఏకీభవించని తెనుగు మరాటీ కన్నడీవాడొక్కడుకూడా లేడని ఘంటాపథముగా చెప్పగలము, ఈరాష్ట్రములో పూర్వము శ్రీరాముడు సంచారము చేసిపోయెను అది ఆదికాలముమాట తర్వాత ఎందరో రాజులు వచ్చిపోయిరి అందొకరు "ఇభరాము" అతని కీముద్దు పేరును ఆంధ్రులిచ్చినారు "మల్కిభరాముడు" అనియు నందురు అనగా మలిక్ ఇబ్రహీం ఖుతుబ్‌షా అను గోలకొండ నవాబు ఎందరో కుతుబుషాలు రాజ్యం చేసిపోయిరి కాని యీ "ఇభరాముడు" మాత్రమే ఈనాడు ఆంధ్రులగానాలలో సజీవుడై యున్నాడు ఎందుక? అతడు ముల్కీ-భాషయగు తెనుగును ప్రేమించెను తెనుగుభాషను నేర్చెను తెనుగు కవులతో తెనుగులో ముచ్చటించెను ఆంధ్రకృతుల స్వీకరించెను అతుకవుల పద్యాల విసరులను వినుచు ఆనందించెను అతనికీర్తి అజరామరమయ్యెను, ఇభరాముని నాటినుండి నేటివరకు మరల తెలంగాలోని తెనుగుభాషకు నాథుడు లభించనేలేదనిన ఇభరాముని విలువ యెట్టిదో యూహించుకొనుడు

సర్ అక్బర్ హైదరీగారు తలచుకుంటే అచిరకాలములోనె రెండవ ఇభరాముడు కాడుకదా జనులకందరికిని రెండవ అభిరాముడుకాగలడు

సర్ అక్బరుగారికి మాతృభాషయందు ప్రేమ? ఈవిషయంవారు ౧౯౩౨ సం॥లోనే పంజాబు విద్యాపీఠస్నాతకులకు స్నాతకోపదేశమిచ్చుచు (Convocation Address) దీర్ఘముగా మాతృభాషా ప్రాముఖ్యతనుగురించి చెప్పియుండిరి ఇదివరలో మేము ఈ భాగాన్ని యుదహరించి యుంటిమి సర్ అక్బరుగారు ఒకమారు ఒకస్థానిక ఉర్దూమాసపత్రికలో ముల్కీ-భాషలకు కూడా ప్రత్యేక విద్యాపీఠాలేర్పాటుచేయించుట అవసరమగును అని అభిప్రాయమిచ్చినది మాకు జ్ఞాపకమునకు వచ్చుచున్నది

ముల్కీ-భాషలకు వాటి సంఖ్యను బట్టి వాటికి తగినస్థానమిచ్చుట చాలా అవసరము నవాబ్ మొహిదీయార్‌జంగు బహద్దరుగారు సర్ అక్బరుగారిని గురించి మాట్లాడుచు వారు ఉర్దూకు ప్రాధాన్యతనిచ్చి ఇంగ్లీషునకు రెండవస్థానమిచ్చిరని చెప్పిరి ఇంగ్లీషును రెండవస్థానంలో ఉంచితే ఉంచనిమ్మండికాని ముల్కీ-భాషలకు ఉర్దూతో సమానస్థానమిచ్చుట అవసరం ఇది సామ్యవాదకాలం కదా? అన్ని సమానమే అయినప్పుడు ముల్కీ-భాషలెందుకు మూలపడి మురిగిపోవలెను? సర్వజనాభిప్రాయాన్ని ఆదరించే మన సర్వజన రంజకులైన ప్రధానామాత్యులవారు ఇక్కట్లకు గిరాలాతీయుచున్న ముల్కీ-భాషల చావకుండా రక్షింతురుగాక

## హర్కారేకు శిక్ష

హైదరాబాదు ౩౧ రా గణేశోత్సవసందర్భములో హైదరాబాదు నగరము న నాగపూరునివాసియైన హర్కారే అనువారు ఉపన్యసించినదియు తర్వాతఅతనిని పోలీసువారుపట్టుకొని కోర్టులో చాలానుచేసినదియు అందరెరిగినదే అతనికేసులో సాక్ష్యాలు వకీళ్ళ వాదోపవాదాలుముగిసెను నగర హింసాద్భవన్యాయశాఖ (ఫౌజ్దారీఅవ్వల్)లో వారివిచారణజరిగెను హర్కారేపై రాజద్రోహముస్థిరపడినదని న్యాయమూర్తిగారు తీర్పుచెప్పి రెండేండ్లకఠినశిక్షనువిధించిరి న్యాయాధికారిగారు అతనికి హైదరాబాదు రక్షణశాసనము ౩౪ సూత్రముప్రకారంశిక్షించిరి ఇంగ్లీషువారికి యుద్ధములో సహాయంచేయకూడదనిన్నీ, ఔరంగజెబుపేరుచెప్పి ఉపన్యాసములో హిందూముసల్మానులలో కలహాలుపెంచేదానికి చూచినాడనిన్నీ మొత్తంపై బ్రిటిషుప్రభుత్వముపై ప్రజలలో అసహ్యముకలిగేటట్టుమాట్లాడినాడనిన్ని చెప్పిరి

## ప్రజాసంస్థలశాసనము

హైదరాబాదు (దక్కన్) ౩౧ ఈశాసనము హైదరాబాదు శాసనసభలో అంగీకరింపబడి వాయిదాపడియుండగా ఇప్పుడు మ-ఘ-వ-ప్రభువుగారి అంగీకారముపొంది శాసనమైపోయినదని ప్రకటించినారు అయితే ఇంత ఆలస్యమునకు కారణమేమి? ప్రభుత్వమువారు ఈశాసనాన్ని గురించి వివిధశాఖలవారి అభిప్రాయాలను తీసుకుంటు ఉండెనట అందుచేత నాలస్యమైందని ఒకవార్త తెలుపుచున్నది

సర్ అక్బర్‌గారిపటము

హైదరాబాదు ౩౧ ఉస్మానియావిద్యాపీఠ కళాశాలాభవనములో గతవారము సర్ అక్బర్ హైదరీగారి పటము బహిర్గతముచేయబడెను నవాబ్ మెహదియార్‌జంగు బహద్దరుగారు పటాన్ని బహిరంగపరచుచు సర్ అక్బర్ గారు ఉర్దూకుచేసినసేవ నుగ్గడించిరి మరియు వారురాష్ట్రముయొక్క ఆదాయాన్ని యెక్కువపన్ను వేయకుండా వృద్ధిపరిచిరనియు సెలవిచ్చిరి

## కీ॥శే॥కూచినరసింహంగారు

ఈ అఖిలాంధ్రావనిలో ఆంధ్రకర్తృకసర్కారులలో శ్రీనరసింహముపంతులుగారి పేరుగనియట్టివారుండరు ఆయన రాజమండ్రి కళాశాలలో పన్నెండేళ్ళ మెట్రిక్యులేషను పరీక్షలంగము పంతులు గార్లవద్ద ఆంగ్లాంధ్రభాషలను నేర్చినవారగుటచే నారెండుభాషలలోను సమగ్రపాండిత్యముగలవారైరి నరసాపురము, కాకినాడ, పిఠాపురము, హైస్కూళ్ళలో హెడ్మాష్టరుగా ౧౫ సంవత్సరాలకుపైగా ఉద్యోగమును చేసి యాయుద్యోగముమండి విరమించి ౧౦సంవత్సరాలు సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యాలయమున శ్లాఘనీయముగ పనిచేసి తమడెబ్బదవ సంవత్సరమున దానినికూడవిడిచి ౪ సం॥ రాలనుండి విశ్రాంతిగైకొనుచు డెబ్బదినాల్గవయేట ౭-౧౧-౪౦ సం॥రమున ఆవాయాసముగా రామస్మరణముచేయుచు వసువులనువిడిచిరి నరసింహముగారి శిష్యవర్గమున కలక్టర్లు, బారిష్టర్లు విద్యాశాఖాధికార్లు పెక్కండ్రుండిరి ఎట్టి గ్రాడ్యేటయినను వీరియెదుట నాంగ్లము నుచ్చరించుటకు జడియుచుండువారు ఆదియుట్లుండ ఆంధ్రమునవో అసదృశవిశారద, వీరి స్వతంత్రములు భాషాంతరీకరణములు నైన రచించిన గద్యపద్య గ్రంథములు పెక్కులను వీరు గ్రాంథికభాషాభిమానముతో ప్రకటించిన ఆనందవాచకములు కొన్ని తాలూకులయాంధ్రావనిలో జదువబడినవని వింటిని నవి పుష్పసముహము పెల్లడికాగలదు ఇట్టి వారికేమి మాటికోపురికి గొప్పలోపము

పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి

## గ్రామ పునరుద్ధరణము

(స్వవి) హైదరాబాదు (దక్కన్) ౩౧ ౧-తినవంబరునాడు జరిగిన స్త్రీసభలో గోపాలపేటరాణీగారగు శ్రీమతి రాణీ లలితాదేవిగారు గ్రామపునరుద్ధారణకార్యక్రమంపై యిట్లుమాట్లాడినారు

హిందూదేశమందంతటయు ప్రజలసామాజికసేవకొరకై వివిధములైన ఉద్యమములు అతితీవ్రముగ అభివృద్ధిచెందుచుండ, గ్రామపునర్నిర్మాణముయొక్క ప్రాముఖ్యతనుగురించి లేక దాని ప్రస్తుతఆవశ్యకతనుగురించి విస్తారముగ చెప్పనవసరములేదు హిందూదేశస్థులు కేవలము గ్రామములలోనివసించెడి జాతియనిచెప్పుట ఆచారమైనది ఇదిసత్యమే మరియును హిందూదేశపుప్రజలకు కర్షకుడే వెన్నెముకవంటివాడని చెప్పుటయందేమియును అతిశయోక్తి లేదు అందుచే గ్రామస్థుల, సామాజిక, ఆర్థికఉద్ధరణకై ప్రవేశపెట్టబడు ప్రతిప్రణాళిక తక్షణమే అత్యుత్తమమైన జాతీయప్రాముఖ్యతను వహించుచున్నది గవర్నమెంటువారిచే తెరవబడిన "సైలా" బ్యాంకు కొద్దిమొత్తముగు ౨౫౦రూ॥ పెట్టుబడితో కేవలమొక సంవత్సరములోనే ౩౦౫౪రూ॥ విలువ అంటుసరకులను విక్రయింపజేసినదనుట మిక్కిలి ప్రశంసనీయము ఇట్టి బ్యాంకులకు సంబంధించిన ప్రతిగ్రామమందును గ్రామ పునరుద్ధారసంఘ నిర్మాణము గవర్నమెంటువారి దృష్టిలోనున్నట్లు నాకు తెలియుచున్నది గవర్నమెంటువారు గ్రామజనుల శ్రేయస్సుకొరకై ఆతురతపడుచున్నదని మజావు చేయుటయందు అనేక ఉదాహరణములలో ఇదియొకటి అయితే ఇట్టి పని చాలకష్టతరమైనదనిన్నీ, అతిగంభీరమైనదనిన్నీ గవర్నమెంటువారికిని, అసాధ్యమైనదిగా కండినను, కొంతవరకు చిక్కులు కలిగించునదియైయున్నదనిన్నీ నేను నమ్ముచున్నాను ఆర్థికశాశ్వత ఫలితములను దృష్టియందుంచక పరిమితిచియూచిన సర్కారుఉద్యోగరీత్యా చేయబడు ఉద్యమములకంటె బాధ్యతరపునచేయబడు ఉద్యమములే గొప్పఫలితములకు కారణములని సంఘసేవచేసెడు ప్రతివ్యక్తికిని విదితమైయున్నది బ్రిటిషుఇండియా ప్రాంతములలో మరియుకొన్ని సంస్థానములలో ఇట్టిఉద్యమములు ప్రజలు సర్కారువారికి తోడ్పడుటవలననే దిగ్విజయముగ జరుగుచున్నవి మనష్టేటుయందుకూడా గ్రామ తరఫున చేయబడిన ప్రయత్నాలు తక్కువలేవు మొదకుననుండు "మెథడిస్టు" సంఘమువారు తమసర్కారుతోపాటు సహకారసంఘములు తెరచి దివ్యమైనపని చేయుచున్నారు మేముగవర్నమెంటువారు ప్రజాసహానుభూతికొరకు పాటుబడలేదని చెప్పుటలేదు కాని ఇట్టి సహానుభూతికొరకై ఇంతకంటె ధికముగ పాటుబడవలెనని కోరుచున్నాము పట్టణములలో నుండు కార్యకర్తలు గ్రామములకు ఇట్టికార్యమునకై పోయిన గ్రామస్థులనుండి తగుసహానుభూతి తక్షణమే దొరకదు అయితే గ్రామపునరుద్ధరణ కార్యక్రమములు విజయముపొందవలయునన్న గ్రామ జనులతో యెక్కువగ సంబంధము కలిగించుకొనుట అత్యవసరము

మన నిజాంరాష్ట్రాంతమందు అనేక జాగీర్లు సంస్థానములు జమీన్దారీలున్నవి ఇచ్చటిగ్రామస్థులయందు అవిద్యదారిద్ర్యము ఉన్న విషయములోక ప్రసిద్ధమే. ఆకారణముచే పేర్కొనబడిన కార్యములు వీరియందుజరుగుట అత్యవసరమైయున్నది ఈసందర్భమున మీకు నాకు మాష్టేటగు గోపాలపేటనుగురించి కొంత చెప్పుటకు సెలవొసంగుదురుగాక!

నేను ఇటీవలనే గ్రామ పునరోద్ధారణకార్యముకు మాష్టేటుయందు సాగించుచున్నాను గ్రామజనుల సౌకర్యమునకుగాను మేము నడకుటదారముచేయుట మొదలగువాటిని ప్రవేశపెట్టినాము మేము అవిద్యనుదూరము చేయుటకై ప్రాథమికస్కూలునుఅభివృద్ధి చేసియున్నాము. రేడియో సంభాషణలు గ్రామపాటలు అప్పుడప్పుడు ప్రాంతీయభాష తెలుగైనందున తెలుగులో పరిశుభ్రత, ఆరోగ్యరక్షణ, మద్యపాననిరోధము మొదలగువాటిని గురించి మాట్లాడుట ఇవన్నియు ప్రజలయందు ఉత్సాహము కలిగించుచున్నవి కొద్దికాలములోనే ఫలితములు చాలా ఉత్సాహకరముగ ఉండునని నేను తలచుచున్నాను అల్పస్థితిలో ప్రారంభించిన కార్యకర్తల ఓర్పు పట్టుదలచే గొప్పఫలితము లభించునని చెప్పుటకు నేను గోపాలపేటవిషయమును ఉదహరించియున్నాను నేను నాశక్తికొలది సమస్త జాగీర్దార్లు, సంస్థానాధీశులు తమ ప్రదేశముందు త్వరలోనే గ్రామపునరుద్ధారణ ప్రణాళికలను అమలులోపెట్టుటకు యెడతెగని కృషి చేయవలెనని ప్రార్థించుచున్నాను

నేను గ్రామస్థులక్షేమమునందు రాజక్షేమము, రాజక్షేమమునందు గ్రామస్థుల క్షేమము ఉన్నదని నొక్కిచెప్ప నవసరములేదు

## నెవిల్ ఛేంబర్లేనుగారి మరణము

నెవిల్ చేంబర్లెనుగారు ప్రధానమంత్రి పదవి నుండి విరమించుకొని చర్చిల్‌గారి మంత్రివర్గములో కొద్దిరోజులుండి, ఆరోగ్యముచెడుటచే రాజీనామా నిచ్చి స్వగ్రామానికి పోయియుండిరి గదా వారక్కడ తమయింట్లో నవంబరు ౯ వ తేది శనివారము భౌతికదేహమును వదలిపోయినారు

## రైలుడబ్బాతంతిలాగుట

హైదరాబాదు, ౩౧ హైదరాబాదునాదర్ష్యాము హైస్కూలు హెడ్‌ప్రిన్సిపాలుగారైన ప్రకాశరావుగారిపైన అతడు రైలులోవచ్చుచుండగా డబ్బాలోనితంతి లాగినందున ౫౦రూపాయిలజుర్మానాయివ్వవలెనని రైల్వేవారు సికింద్రాబాదు కోర్టులో దావాతెచ్చిరి ఎందుకులాగవలసి వచ్చిందంటే ఆడబ్బాలో కొందరు పంజాబీసిఫాయిలు జొరబడి ప్రయాణీకులవద్దనున్న పండ్లనులాగుకొని భక్షించిరి ఇదేమన్యాయమండీఅంటే ఎగబడికొట్టేదానికివచ్చిరి మరియట్టిగుండాతనమును మాపించగా భయపడి రైలుతంతినిలాగితే గార్డుమున్నగువారైనా రక్షించుతారేమోఅని సదుద్దేశముతోనే అప్రకారంచేసినాను అనిజవాబిచ్చిరి న్యాయాధికారి వారిని మంచిపనిచేసినావు నీపైన నేరములేదని కేసుకొట్టివేసినారు

సఫాయిదొమ్మిక

హైదరాబాదు ౩౧ హైదరాబాదు బేగంబజారు గౌలీపురాలో పండిగుండేరావుగారు తమపురగాలకు సంఘసభ్యత్వాన్ని నడిపించుకొన్నందున వారిస్థానములో రాజాబహద్దరు వెంకటరామారెడ్డిగారిని ఎన్నుకొందుమని అచ్చటివారనుకొనుచున్నారు

గృహలక్ష్ములుగా భావింపబడు దయార్ద్రహృదయులగు స్త్రీలవలన అద్భుత కార్యములు జరుగును దయారసముగల స్త్రీలు తమ గృహాముల ప్రవేశించినతోడనే వారికుటుంబము వారు బ్రహ్మానందమును పొందుదురు స్త్రీలసంఘసేవాపరాయణత్వమునకు అతిశీఘ్రముగ ఫలము లభించును ప్రసవవేదన యనుభవించెడు స్త్రీకి, లేక రోగపీడితులైనవారి నర్సు యొక్క దర్శనము లభించగానే దేవదర్శనమైనట్లు ఉల్లాసంగును ఆమె దయగల మృదువుఘు సంభాషణలకు హృదయావేదన ఉపశమించును.

పైచెప్పిన కారణములచే తోడిప్రతినిధి సోదరీమణులకు జాతిసేవయుంటు అనేక అవకాశములున్నవని మరల నొక్కి చెప్పుచున్నాను గ్రామస్థులతరఫునుండి చేయు నామనవి వీరందరు ఆలకించెదరని తలచుచున్నాను

